# మనవి.

"కర్మలలితమగు విశాలజీవితమునందు గౌరవకార్యముల కెట్టి పవిత్రత తనరునో, కొంచెపుఁ బనులకుఁగూడ నట్టిపవిత్రత కలదనునది మహాకవి రవీంద్రుని యుదాత్తవాక్యము". ఈయుదారాశయమునకు నిదర్శనములు, మనదేశమంతట నల్లుకొనుచున్న యభినవప్రబోధముచే ప్రేరితములై, విరివిగఁ గాన్పించుచున్నవి. ఈనూతనోత్సాహమునుండి యుద్భవించిన ధర్మకృత్యములకు, విజయవాడకనతిదూరముననున్న, పడమటలంక, గమనీయాంగమువంటిది.

పడమటలంక ప్రకృతికి ప్రియపుత్రిక. ఫలవంతములు, మనోజ్ఞములునగు తరువులు, పుష్పఫలలతా శోభితములగు తోటలును, నిసర్గగాంభీర్యముచే నిశ్చలములగు పర్వతములును, ఈచిన్నిగ్రామము వానుకొని యుండును. ఈపల్లెయందు క్షత్రియదంపతులగు నగనిగడ్డవల్లభరాయలకును మహాలక్ష్మమ్మకును గుణసంపన్నులైన పుత్రులు గలరు. వీరిధర్మాసక్తి కోదండరామాలయ నిర్మాణమునకును, పాంథజనోపయోగకరమగు సత్రము కట్టించుటకును గారణము. ఈసత్రమునకంతర్గతముగ వైద్యవిద్యాకుశలులగు బసవయామాత్యుఁడగు తృతీయ సోదరుఁడు ఆయుర్వేద ధర్మవైద్యశాల నొకదాని స్థాపించి వైద్యసహాయమొనర్చుట కీర్తనీయము. ఇచటనే యభిమానుల సహాయమున సుమారు వేయిరూప్యముల విలువఁగల చిన్న మేడయందు పుస్తక భాండాగారమొండు నిర్మింపఁబడినది. ఈకార్యనిర్వహణమున భారమంతయు వహించిన సీతారామావధూతలవారు వంద్యులు. కోదండరామాలయ ధర్మకర్తృత్వపదవినున్న జ్యేష్ఠసోదరవర్యునకును వారుపకృతికై చేయు కష్టములపాలు పంచుకొనువారికిని, యితరధార్మికులకును నిరామయవిశ్రాంతి శ్రీరామచంద్రుఁ డొసంగుఁగాక!

పడమటలంక తొలుదొల్తనుండియు నామనస్సు నాకర్షించినది. రామాలయమును, నచటి కల్యాణోత్సవములును ఆనందదాయకములగుటచే నచటికి తఱచుఁ బోవుచుంటిని. నాగుణోపాధి శ్రీరామప్రేమ తేజముచే వికసితమగుటచేతనో, కోదండరాముని దయాసేచనముచేతనో "పడమటలంక రామననుఁ బాలనసేయవె జానకీపతీ!" యనుమకుటమప్రయత్నముగ నాకుం దోచెను. హృద్గతములై పెనగులాడు భావములను వెలిబుచ్చుటకై, పద్యములింకను వ్రాయఁదలఁచి, కవితారచన నారంభించితిని. ఇరువది యైదుపద్యములను కొంతకాలమునకు ముగించితిని. పదపడి చిత్తవృత్తియనేక విధములఁ బోవసాగెను. సాహితీచర్చ సమగ్రముగ నొనర్పక, కవితయొక్క సౌందర్యసౌష్ఠవములు తెలియక, పద్యము లల్లసమకట్టుట, వెగటుగఁదోఁచెను. 'అమలోదాత్తమనీషచే' సిద్ధించు 'రమణీయార్థ ప్రతిపాదక' శక్తినిర్బంధించిన రాదనియెఱింగి, సరస్వతీదివ్యపీఠము నసత్కల్పనలచే కళంకిత మొనరింపనను గాఢనిశ్చయమేర్పఱచుకొంటిని. నాసంకల్పము సఫలమొనరించుకొనుటకు కవీశ్వరుల యొద్దకేగి రాముని ప్రేమామృతమును సంగ్రహించి వలయు నానందమునుఁబొంది, సోదర సోదరీమణుల కుపయుక్తమని రామభక్తుల పేరనర్పించుచున్నాడను. తమయున్నతాశయములను లోకమున కందసాధ్య మొనరించిన కవిచంద్రులకెల్లరకు ప్రణయపూర్వకనమస్కారము లీగ్రంథముఖమున నంపియుచున్నాడను. ముద్రణాస్ఖాలిత్యములును, తదితరలోపములకును పాఠకమహాశయులమన్నన వేడెద.

ఇట్లు,
సత్కవివిధేయుడు,
నాళ్ళచెరువు రంగరావు.

---

తె॥ ఈపుస్తకముపైవచ్చుస్వల్పలాభమును పడమటలంకలోనున్న ధర్మవైద్యశాలకు వినియోగింపఁబడును గాన, ధార్మికులెల్లరు తమబాధ్యతను నెఱుంగగలరని నమ్ముచున్నాడ. ఇందుసాధకులకు గాను నొకయాశ్రమము నిర్మితము.

ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

శ్రీ

# బడమటలంక రామస్తవము

ఉ॥ "శ్రీకవితాలతల్ పవన సీమల కేగి తదీయపాలకా
నీకము గోరఁగా సుమములిచ్చెఁ, దత్సుమముల్ భవత్పద
శ్రీకమలార్పణంబు నొనరించితి; దీనుఁడనయ్య, సత్కృపా
లోకముఁ గోడఁబోవవలె నిక్కెవరింకను జానకీపతీ"॥

నా॥ రం॥

శ్రీమాన్ గొట్టుముక్కల రమాకాంతాచార్యకవి (బి.ఏ.)
విరచితము, గుంటూరు.

చ॥ పుడమిని నేది చేసినను, భోజనవేళల, యజ్ఞదానముల్
తడయక నర్చ్యచోఁదపములన్ బొనరించు నెవన్ ద్వదర్పణం
బుడుగక చేయుచుండు బుధలుత్తమ దైవమటంచు నమ్మి నిన్
బడమటలంక రామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ 1

చ॥ చెడుగులు నిన్నుఁ గాంచెదరు చిల్లర దేవులతోడపాటు వా
రొడలని నీకెఱుంగక, యయో! రఘువరా నని రామదాసు చె
ప్పఁడె మునుపన్యదైవముల భక్తి భజించిన వారిపొందుచేఁ ॥బడ॥ 2

చ॥ కొడుకు కదా చతుర్ముఖుఁడు, కూరిమిపౌత్రుఁడు రుద్రుఁ;డీవు నొ
క్కఁడవు త్రిమూర్తులందనుట కార్యము లేదు: భవద్విభూతిఁ గ
న్పడెను పృథక్స్వరూపమున వైష్ణవమూర్తి, పరుండవీవె కా
పడమట లంకరామ! ననుపాలన సేయవె జానకీపతీ॥ ౧౧

చ॥ జడియఁగనేల నిన్నుపనిషత్తులు గీతలు బ్రహ్మసూత్రముల్
నుడువఁగ మూలతత్త్వమని, లో, వెలినుండి భరింతువంటి, చి
జ్జడములకున్ విలక్షణపదస్థుఁడవై పురుషోత్తమాఖ్యచేఁ ॥పద॥ ౧౨

చ॥ ఉడుగక చాటెడున్ బురుషసూక్తమజస్ర, మజాయమానుఁడై
పొడముదు వీవనేకవిధమూర్తులనం, చవతారబోధగమే
ర్పడినను గాని నిన్మనుజభావముతోఁ గనకుండఁ జాలరో ॥పద॥ ౧౩

చ॥ అడరెడుఁ దత్త్వలింగముల నన్నిటనీ ఘనమూర్తిఁ గీరితిం
చెడిపదముల్, దదన్యములు చెల్లును గౌణములై; శ్రుతిన్ వినం
బడుపదముల్ పరస్పరసమన్వయశక్తి నినున్ నుతించుఁగా ॥పద॥ ౧౪

చ॥ పుడమిని సాత్త్వికోత్తముల పుణ్యఫలంబవు, వారు నిన్నుఁదా
మెడ తెగనట్టి భక్తి భజియింతురు; రాజసతామసుల్ మదిన్
దడవరొ కష్టదుర్గొల్చిన నన్యగతిన్ గొలువంగఁ జాలరో ॥పద॥ ౧౫

చ॥ విడువుము సర్వధర్మములు, వేగమయవ్యభిచారభక్తి నా
యడుగులె యాశ్రయింపుము మదన్యము లేదు సమస్తపాపమే
నుడిపి విముక్తి నిత్తునని యూగడఁ బల్కితి గీతలందునో ॥పద॥ ౧౬

చ॥ నడచితి మేలుబంతిగ జనంబులలో సకలాశ్రమంబులన్
గడపితి ఘోరరాక్షసులఁ గీతిన్ గడించితి శిక్షరక్షణన్
గడలి సమస్త సద్గుణగణంబుల కన్న యశంబుఁ గాంచితో ॥పద॥ ౧౭

చ॥ పొడమఁగనైతి దోమగ నెపుర్వగనో మతిపక్షి గానో నేఁ
గడకొక చాపలాయిగనో కల్మషదూర! భవచ్ఛుభాకృతిన్
దదయక కాంచియుందుఁగద నాఁడె భవాబ్ధి దరించియుందుఁగా॥ పద॥ ౧౮

చ॥ ఉడుతకుఁ గోఁతిమూఁకలకు నూరకయబ్బెను నీదుసేవ, మ
ర్త్యుఁడు ఋజుమార్గమందుఁ జనఁనోపఁడహంకృతి, జంతుజాలముల్
నడచుయథోపదిష్టగతిన్యాయ్యమె నీదగు పక్షపాతమో
పడమట లంకరామ! నినుబాలన సేయవె జానకీపతీ॥ ౧౯

చ॥ ఎడపక వేదమెల్లఁ బఠియించిన లాభములేదు, కర్మముల్
సుడివడఁ జేసినన్ ఫలముసున్న, త్వదంఘ్రిసరోజభక్తియె
న్నఁడును నెఱుంగఁజాలని జనంబులకున్ శ్రుతివేద్యవైభవా॥పడ॥ ౨౦

చ॥ పడితి నగాధసంసరణవార్ధిమధ్యమునందుఁ గొట్టుకోఁ
దొడఁగెఁ దరంగ ఘట్టనలతో నసువుల్ మదిఁదోఁపఁదయ్యెనీ
యడుగులుదక్కఁ దెప్పఁగదయయ్యనియింకఁదరింతుసంసృతిన్॥బడ॥ ౨౧

చ॥ విడిచితి వర్ణభేదములు, వీడితివిత్తసతీసుతాదులన్
విడిచితిజాతిభేదములు, వీడితిఁ దజ్జనితాభిమానముల్
నడచెద సత్పథంబున ననంతఫలప్రదయింకమీఁదనో ॥పడ॥ ౨౨

చ॥ జడుఁడను బాపకర్ముఁడ నృశంసుఁడ భాగవతాపచారశీ
లుఁడఁ బరదారవిత్తకృతలోభుఁడ డాంబికవర్తనుండ నేఁ
బడితిని గాళ్ళమీఁద నిఁకఁ బాలనముంచెదొ నీళ్ళముంచెదో ॥పడ॥ ౨౩

చ॥ గడుసుఁదనంబొ నిర్దయయొ కల్పనఁ జేసితి పాపపుణ్యపుం
బెడిదపుమార్గయుగ్మము వివేకులకైనఁ దదీయసూక్ష్మముల్
కడఁక నెఱుంగరావని సలాఁతులకెట్లు సమన్వయంబగున్ ॥బడ॥ ౨౪

చ॥ బుడుతలమేము, ప్రేరకుఁడవున్ ఫలదుండవు, కర్తలంచుఁ జే
రిడిమముశిక్షసేయఁదగునే? నరకంబులుతూకులెక్కయే
అడుగులఁబట్టి వీడమెటులచ్చటికంపెదొ మమ్ముఁ జాతమా ॥పడ॥ ౨౫

చ॥ అడుగఁ ద్రిలోకసేవ్యభవదాకృతిచూపుమటంచు వైభవం
బడుగఁ ద్రిపాద్విభూతియును నక్కఱలేదు భవత్పదంబులే
నడిగెదఁదల్లి స్తన్యమెగదా పసికూనలకాసగొల్పెడిన్ ॥బడ॥ ౨౬

# శ్రీమాన్ శేషాద్రిరమణకవులచే విరచితము, శతావధానులు.

గంపలగూడెము రాజావారి ఆస్థానకవులు.

ఆశుధారలోఁ జెప్పబడినవి.

చ॥ జడుఁడవివేకశూన్యుఁడను శక్తివిహీనుఁడ నీదుపాదముల్
కడుభయభక్తిలింపెసగఁగా స్మరియించుచునుంటి వేగ నా
యిడుములబాపి శాశ్వతసుఖేచ్ఛనొసంగి కృతార్థుఁజేసి శ్రీ
పడమట లంక రామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౧

చ॥ కడుఁజలియించుచుంటి నది, కాయము వ్యాధిమయంబు భావమె
ప్పుడు విషయాంతరంబులను బొల్చుచునుండు, నినున్ దలంపనా
కుడుగని తాల్మియిచ్చియటు లోమెదొ భారము నీది సుమ్ము శ్రీ ॥పడ॥ ౨

చ॥ నడుచెడు వేళ, మంజుకలనాదవనప్రియగీతముల్ చెవిన్
బడుసమయాన, నంగనలవాలికమోపులు కాతుకమ్మెన
ర్పడితతి యుష్మదీయపదసేవనమున్ బొనరింపఁజేసి శ్రీ ॥పడ॥ 3

చ॥ ప్రాఁడమినదాదినీచరితమున్ వినివారఁగ నగ్గోలనైతి, పై
వెడఁగు నగయావనంబుడిపి వీడనైతి, పరార్థసిద్ధియై
ప్పుడు దయచేయుపంచుఁదలఁపుల్ నినుఁ జేరఁగఁ గోరుచుంటినో ॥పడ॥ ౪

చ॥ ముడిచిన కేలుదోయిచూను, మోడ్పుకనుంగవయున్, స్థిరేచ్ఛయున్
కడకయుఁ జెన్ను మీఱగను గౌరవబుద్ధి స్మరింతు, నన్ను భ
క్తుఁడనియు భృత్యుఁడంచు దయతో దిలకింపుము మోక్షమిమ్ము శ్రీ॥పడ॥ ౫

చ॥ ఇడుములఁ బొందు వేళ పరమేశ్వరుఁడే చ్చటలేఁడటంచు నా
విడిచితి సౌఖ్యమందుతఱి విశ్వము నీశమయంబటంచు నే
గ్పడ వచియించినాఁడను బరస్పరభేదమెఱుంగనైతినో ॥పడ॥ ౬

చ॥ తడయక సుపన్యసించుటలు దైవము లేఁడనుటల్ త్యజించి, యొ
క్కడె పగమార్గదాయియగు గణ్యుఁడు వాఁడె రఘూద్వహుండు నా
యిడుములఁ బాపనాతఁడొకఁడే గలఁడంచుఁ దలంచుచుంటినో ॥పడ॥

చ॥ పుడమిపొలంతినాఁదగిన ప్రాలుక జానకిభార్యగా, వసి
ష్ఠుఁడు నిజగోత్రకర్తగ ప్రసిద్ధగుణాంబుధి యంజనాతనూ
జుఁడు పదపద్మభక్తుఁడుగ శోభిలుతావకమూర్తి నెంతునో
పడమట లంకగాదు! ననుబాలన సేయవె జానకీపతీ॥ ౮

చ॥ కడలిపయిన్ సముగ్రశితకాండపరంపగనింపవింటివె
క్కుడి మఱియంతలోనె పరికీర్ణదయానుయదృగ్రుచిచ్ఛటల్
జడనిధికైననింపనినుఁ శాంతుఁడవందునా? కోపియందునో? ॥పద॥ ౯

చ॥ కడచినకాలముల్ దలఁపఁగాబనిలేదిఁక, నిన్నునింకనై
ప్పుడుస్మరియింపనిత్తఱిని బూనితిచిత్తమునన్ బ్రతిజ్ఞ నా
కడఁకకు సర్వమైనఫలకాండము నిమ్మనియైనఁగోరనో ॥పద॥ ౧౦

మధ్వ శ్రీ శాస్త్రీ కృష్ణాచార్యవిరచితము,
టవున్ హైస్కూలు సంస్కృత పండితులు, శతావధానులు,
గుంటూరు.

ఉ॥ జక్కుఁడనసత్యవాది నఘుస్తుఁడ లోకవిగర్హ్య వృత్తుఁడన్
బిడియములేని వాఁడ నవివేకిని మూర్ఖుఁడ మూఢుఁడన్ స
గర్వుఁడ నిటులయ్యునిన్ను మదిరూఢిగ గొల్చుచునుంటిగాన నో॥ పద॥ ౧

చ॥ జడనిధికన్యకాధవ, విశాలదయామయ దుగ్ధవార్ధిమ
గ్నుఁడ పతితైనచవృత్తిని నన్నువిడవాడఁగఁబోకుమయ్యయీ
పుడమిని నీవుదక్కనను బ్రోచెడివారెవరయ్య యింకనో ॥పద॥ ౨

చ॥ అడఁగెను దేహశక్తి వడుగం డెను గర్వము మానెనాస యి
ప్పుడమిని దేని గన్నను తుబుక్కను బుద్ధి జనించె రాముఁడో
క్కఁడె నిజమైన బంధువనిగన్గెను నిశ్చయమింక నాకునో ॥పద॥ 3

ఉ॥ విడచితిదుష్టభావమును వీడితి బంధుగులందు నాసనే
విడిచితి విత్తవాంఛ యిఁకవీడితి సొందనసేల యంతయున్
విడిచి భవత్పదాబ్జములనే మదిఁ గట్టిగఁ బట్టినాఁడనో ॥పద॥ ౪

చ॥ అడుగఁగఁ బోఁడు నీకుసుగమాయని నన్నొకఁడేని మాటువ
ల్కఁడిపుడు బల్కరించిన నొకండును నింతకుమున్న నాకులోఁ
బడినటువంటివారె యటు ప్రక్కకుదొలంగుచు నేగుచుండిరో
పడమట లంకరామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౫

చ॥ అడుగను రాజ్యమిమ్మనుచు నడ్గను మాన్యము లిమ్మటంచు నే
నడుగను భోగభాగ్యముల నడ్గను స్వర్గము మోక్షమేని నే
నడిగెద నీపదాబ్జముల యందొక నిశ్చల భక్తిమాత్రమే ॥పడ॥ ౬

చ॥ పుడమియు రాజ్యముల్ చెలులు భోగము భాగ్యము బంధువర్గముల్
చెడి కడుదుఃఖముల్ బొసఁగఁజేయును మానవకోటి కెన్నఁడున్
చెడనిది నీదుపాద సరసీరుహభక్తియె నాకొసంగవే ॥పడ॥ ౭

చ॥ అడవినిఱాయియైపడు నహల్యను బ్రోచిన నీపదాబ్జముల్
గడిగి కృతార్థుఁడైన జనకక్షితి పాలునిపున్నె మెమనన్
జడనిధికన్యకాంతభవ జానక నప్పనఁజేసెనీకహో॥పడ॥ ౮

చ॥ అడుగిడఁ బాపకర్మములె యంటుచునుండును గాని పున్నె మె
ప్పుడు గలుగంగఁబోదు, ఖలపూరుషమర్దన! నీదునామముల్
నుడువఁగ నోరురాదిఁక ననున్ గరుణించెడివాఁడెవండురా॥పడ॥ ౯

చ॥ కొడుకులు లేరటంచు నొక కొన్ని దినంబులు చింత పిమ్మటన్
గుడువగ బువ్వలేదనుచుఁ గొన్ని దినంబులు చింత యెంతయే
ర్పడినను చింతమాత్రము భవంబున దీరదదేల నాకునో ॥పడ॥ ౧౦

చ॥ దుడుకుఁదనంపుఁ జైదముల తోడనె బాల్యము సెల్లెపిమ్మటన్
బడతుల చింత జవ్వనము పాడయిపోయెను వార్ధకంబునన్
దడఁబడు వాక్కుయెప్డు, భవతారక! యింకనినున్ భజంతునో॥పడ॥ ౧౧

చ॥ పుడమిని మాతృగర్భమున బుట్టినదాదిగ బాపకర్మముల్
కడుసనరించి నీదుపదకంజములన్ గొలువంగ బోని యీ
జడమతి, సృష్టిచేస్తి భవసాగరమగ్ననపండతున్ ఖలున్॥పడ॥ ౧౨

## బ్రహ్మశ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రి విరచితము.

గుంటూరుజిల్లా, ఇంటూరు.

చ॥ ఉడిగి మడింగికిక్ బ్రతిఫలోదయముల్ గయిసాదికోరున
బ్బడుగుల దుష్ప్రదైవముల బ్రాపిసుమంతయు గోరనయ్యనీ
యడుగులె కొల్చుకొందు జడుడాయనిత్రోతువో యుద్ధరింతువో
పడమటలంకరామ! నను బాలనసేయవె జానకీపతీ॥ ౧

చ॥ కొడుకులు కొమ్మలుక్ విడిదికొంపలుగోడలు గాపురంబు బె
న్నడుగుకు గ్రాహకంబులనుమాటనెఱుంగక మోసపోయితిక్
జెడితిని కోలుపోయితిని చిక్కులశల్లని కేమిసేతువో ॥పడ॥ ౨

చ॥ జడధులు నీపరాక్రమవిశాలతదామెఱుగంగ నేర్తురే
యడుగుల జేరునంతకు మహాత్మ్యయథార్థ కళారసజ్ఞు లె
ప్పుడును దదాత్మతాకలన బొంగుచు బొర్లుచు నుందురట్లుగా ॥పడ॥ 3

చ॥ బడలితినయ్యలెండ్రిపలుబాములలోబడియింక నెట్టులీ
తొడుగుకృతార్థతక్ గనటనోరపునీకడగంటి చూపు పూ
జడిగురియింపకున్న దివిజస్తుతివైభవగుణ్ణైతింగినో ॥పడ॥ ౪

---

## మధ్వశ్రీ పల్లెపూర్ణప్రజ్ఞాచార్యవిరచితము,

టవుక్ హైస్కూల్ పండితులు, గుంటూరు.

చ॥ పుడమినగాధమైదనరు మోహమహార్ణవరాశిమధ్యలో
బడినటువంటిమాకు నలపావనమైదగు నీదునామమక్
పడవ లభింపకున్న నెటు ప్రాణముదాల్తుము మేన నింతగా ॥పడ॥ ౧

చ॥ పుడమిని నెల్లమానవులు పుణ్యము సేసిన నింక నెట్టు లే
ర్పడు నలనీకు నీపతితపావననామము పాపనుంచనం
బడవనిగామ్ముబోటియునదల్ జనియింపకయున్న పట్టునక్ ॥పడ॥ ౨

చ॥ జడుఁడనిలేనిపోని యుపచారము నా మెడఁజుట్టి యేలన
న్నడేఁపఁగ, నేను యంత్రమును నారయ నెంత్రివి నీవుగాన నీ
నడపినయట్లు నే నడతు నాదగుతప్పిద మేమియింకనో
పడమట లంకరామ! ననుబాలన సేయవె జానకీపతీ॥ 3

చ॥ ఎడదలపోయఁగా జగతికెల్లను దండ్రివి నీవుగావునన్
గొడు కవివేకినై చెడుగుకొండొక సేసిననైచి మార్గమం
దిడుటది నీకుధర్మముగు నేవిధినైనఁ దలంచిచూడఁగాఁ ॥పడ॥ ౪

చ॥ గడపితినిన్ని యేండ్లు వృథాగా నవివేకవశంబుచేనిఁకం
గడచినదానికిన్ వగవఁగాఁదగదీపయి నీపదాబ్జమం
దెడ తెగనట్టి భక్తినిపుడిచ్చి కృతార్థునిగాఁ నర్చెనో ॥పడ॥ ౫

చ॥ కుడిభుజమల్లనాడెపడి ఘోరరణాంగణమందు నాఁడు క
వ్వడికి సమస్తరాజ్యవిభవంబులొసంగుట యొంటుఁ చాలదే
కడమదియేల, భక్తజనకారుణికుండని నిన్నుఁబిల్వఁగాఁ ॥పడ॥ ౬

చ॥ పుడమిని తల్లిగర్భమునఁ బుట్టినయప్పటినుండి యాశ్రమం
పడినినుఁజూడఁగా మొగమువాచిన వాకిఁక నీదుదర్శనం
బిడుము, జడుండటంచుమది నెంచకు నీకొక రూపయుల్లరుం ॥పడ॥ ౭

చ॥ చెడినదిజ్ఞానచక్షువిఁకఁ జీకులమైతిమిగానమాకు సం
గడి యొకదారిఁ జూపుటది గౌరవమైతగు, మంచివారునై
పడియుటులైనమార్గమును బట్టుదురయ్య పరానపేక్షగా ॥పడ॥ ౮

చ॥ పడఁతులుపుత్రులాపదలఁ బాపుదురంచని మోహమందునన్
బడి మరలంగలేక తల్లప్రాణము శోకకుపచ్చె నేఁటికిం
బుడమిని నీవదిక్కనెడి, బుద్ధిజనించెను నిశ్చయంబుగాఁ ॥పట॥ ౯

చ॥ పడిషుసపాపకూపమునఁ బైటికివచ్చుటకొక్క తెన్నుగన్
పడకిటు, దేవులాడుననుఁ బల్మరుగాంచియుఁ గన్నులారఁ బ్రే
ముడినొకగట్టుఁజేర్చుటకుఁ బూనక నుండుట న్యాయమౌనెనో ॥పడ॥ ౧౦

## బ్రహ్మశ్రీ శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి విరచితము.

టవున్ హైస్కూలు పండితులు, గుంటూరు.

చ॥ ఎడపక సర్వదైవత, సమీడ్య పవిత్ర చరిత్రు నిన్ను నా
యెడఁద ననుసంస్మరింపుచు, ననేక దినాగతమైన, జన్మపుం
గొడవ నడంపఁగోరితి రఘుప్రవరా! యదియొక సాధ్యమా!
పడమటలంక రామ! నను బాలనసేయవె జానకీపతీ ॥పద॥ ౧

చ॥ విడివడి వేదశాస్త్రపద విశ్రుతి నేని గడింపనైతిఁ జే
ర్పడి నబుధేంద్రసేవ గుణవర్ధనగణ్యత గాంచనైతి న
ల్గడల యశమ్ముఁ గ్రమ్మ ననఘక్రియలం బచరింపనైతినో ॥పద॥ ౨

చ॥ పుడమి జనించి బాల్యము చటుపోవఁగ యౌవనమంకురింప, దుం
దుడుకు పనుల్ పొనర్చి; ఖలధూర్తవహాసంగతి, పిచ్చలింపఁగీ
ర్వాడి, కడుమూఢభక్తి నినుదగ్గఱుపగ్గల మ్రెగ్గమంటి, నో ॥పద॥ ౩

చ॥ అడుగులు లెక్కఁబెట్టుకొని, యామడలామడ, లేగుదోగికిన్
దడఁబడు నెట్టులకా, కృతులు తంద్రబయల్పడు నాకు, నెప్పుడె
ప్పుడు నినుఁ గాంతునో యనుచుఁ బ్రొద్దులు పుచ్చు జడుంటనాట, నో ॥పద॥ ౪

చ॥ "తడవు తపంబుఁ నోములు పదల్ ననుఁ దృప్తి నొసర్పఁజాలవె
య్యెడ దృఢభక్తిమాడ్కిఁ; నది హెచ్చిలి లేశమొసంగ మేరువం
చొడయఁడ నీకపల్కిత" ను యోగులమాటవరాలమూటగా ॥పద॥ ౫

## నోరి హనుమచ్ఛాస్త్రి విరచితము, తెలుఁగుపండితులు,

మిషన్ కాలేజి, గుంటూరు.

చ॥ జడమతితోడ సోమకుఁడు చయ్యన వేదములన్ హరించి తా
జడనిధియందు దాఁగఁగ నుజాడ నెఱింగియు మత్స్యరూపమై
కడువడి రాక్షసున్ దునిమి గ్రక్కునఁ దెచ్చితి వీవె వేదముల్ ॥పద॥ ౧

## బ్రహ్మశ్రీ నెమ్మలూరి రామమూర్తి విరచితము.

స్కూలుమాష్టరు అమృతలూరు, గుంటూరుజల్లా.

చ॥ జడులువివేకశూన్యులు నిజంబనిజంబు గ్రహింపలేక నీ
యెడ, లఘుభావమూనినను నేశిలయంచనినంత నేమి నీ
యడుగులు గొల్వకుందురె మహాత్ములు సన్మునిపర్వకోటియో
పడమట లంకరామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౧

చ॥ చెడుమతిచేనహల్యఘన శిక్షకుబాల్పడిదిక్కులేని భా
సడవినినొక్కరాయియయి తాలుగరుంగగ నేడ్చి యేడ్చి నీ
యడుగులసోఁకనాయెసతి యాపదపద్మను హత్త్వమెట్టిదో॥పద॥ ౨

చ॥ సుడివడుగాలిచందమున స్రుక్కుచునీభువియందు మోహపుక్
మడుగునమున్గితెప్పరిలుమార్గము గోవదునీదయాగసం
బడిగితి యుద్ధరింతువను నాశనుదేవ నీదుచిత్తమో ॥పద॥ 3

చ॥ పిడికెడుతండులంబులకుఁ బ్రీతివహించితివందు కాదుచే
లుఁడె ఘనపాత్రియాశబరిలో నొసెంగిలిపండ్లొసంగి భ
క్తుడనగ బ్రాణమిచ్చు గుహకోపిదమూర్తివి యావొకండవే॥పద॥ ౪

చ॥ గడుసుఁ దనంబునన్ మదము కన్నులఁ బ్రామఁగనిక్షేహసించు నా
జడుతాకస్తూరినిన్ గనిసఁ జాలు నిమీలితలోచనత్వముక్
బడయరెపారవశ్యమున బాదరెయాదరికేలుమోడ్పరే॥పద॥

చ॥ అడవులదీక్షతో నహహగహంబు దపంబొనరించువారులే
పడయరునిన్ను భక్తజనపాల! జగన్నుతలోకరక్షకా
జడుఁడకిరాతకుండనతి చంచలచిత్తుఁడ నాకుదక్కదే ॥పద॥ ౬

చ॥ ధృఢతరభక్తినిన్ గొలువ దీనులకున్ సకలేప్సితార్థముల్
పొడమును, మోక్షరాజ్యమున బూర్ణసుఖంబులదోగుచుండ్రు నీ
యడుగులనమ్మ భక్తులకహా! వశవర్తివియై పెఱుంగుదో ॥పద॥ ౭

చ॥ జడధితనూజ, యాసిరియె, జానకి, లక్ష్మణుఁడుందిశేషువౌ
కడుబలశాలురాక పులెకా? సురలీభువినుద్ధరింపనా
యెడజనియించితయ్య జగదీశ్వరనీవనవిష్ణువౌదువో॥పడ॥
పడమట లంకరామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౮

---

## బ్రహ్మశ్రీ జ. సుబ్బరాయ విరచితము.

### నెల్లూరు.

చ॥ జడలుధరించి కామముఖశత్రులనెల్ల జయించి నిచ్చలు
న్నడగిభవత్పదాబ్జభజనవ్రతనిష్ఠితులౌచుఁగాలముల్
గడపెడునారదాదులును గానగఁజాలరునీప్రభావమో॥పడ॥ ౧

చ॥ జడనిధివేష్టితంబయిన సర్వమహీతలమేలుసార్వభౌ
ముఁడునుమద్వదీయచింతన విభూతి,నెసంగకయుండెనేనిఁ జే
రెడవినిఁ గాచువెన్నెలటు వ్యర్థములౌ గదవానిభోగముల్॥పడ॥ ౨

చ॥ విడువక నీచరిత్రమును వీనులవిందుగవిన్న, నట్టియిం
పడరఁగనీదు పేరు మనసారభజించిన నీసురూపముల్
గడకొనికన్నులారఁ బొడఁగన్న నసుంబులువాయకున్నెనో॥పడ॥ ౩

చ॥ ఎడపకమాటువేసి వధియించితికోతిని శౌర్యధైర్యముల్
గడలుకొనన్ సురారివిభుఁ గాలునివీటికిఁ బుచ్చితీవు ధీ
రుఁడవౌగధీరుడోయెఁబుగరూఢిగఁ జిత్రమునీచరిత్రమో॥పడ॥ ౪

చ॥ ఎడనెడఁబోయియాశబరి యిచ్చినయెంగిలి పండ్లదింటి వే
ర్పడనిజభ్రాతృసోదరుని బాలనసేసితి వేమిసేయబా
ల్పడవు చలింపనట్టిదృఢభక్తియొకందుప్రాసంగ నేనినో!॥పడ॥ ౫

చ॥ ఉడుతయొకందుసాయపడ నల్లమునన్ ముదమంది ప్రోచితీ
వుడుగనిభక్తిసేయుచు సముజ్జ్వలభూషణవాహనాదుల
న్నిడశ్రమనొందు గొపనను నేలవుసల్పని మెప్పనేలకో॥పడ॥ ౬

# 19

బ్రహ్మశ్రీ. గోపాల పిచ్చయ్యశాస్త్రి విరచితము,

శతావధాని, నెల్లూరు.

చ॥ కడుభరమైన కొండలుదకమ్మునఁ దేలుప్లవంగమాత్రిఁ దుర్
జడనిధిదాటు బల్వలముచాయనమేయమహత్త్వమొప్పఁగాఁ
బొడవడచున్నిశాచరసమూహము, నీకృపసుంతయున్నచో
పడమటలంకరామ! ననుఁ బాలనసేయవె జానకీపతీ॥ ౧

చ॥ ఉడుగణమింతయంచు నెటులో గణుతింపగవచ్చు భాగము
న్నడువగవచ్చు నబ్ధికి గనుంగవగాలినిఁ జూడవచ్చుగా
కడరు భవన్మహత్త్వమిదియంచన నింగన నెవ్వఁడోపు? నో ॥పడ॥ ౨

చ॥ ఉడుతయొకండొ సాయమెపుడో యొక యించుక నీకుఁ జేసెనం
చుడుగని పేర్మిదానికి నహోయనముక్తినొసంగితంట, యా
సడివిని నిన్నుఁ జేరితిని సామి! నుఱట్టులనన్నుఁ జూతువో ॥పడ॥ ౩

చ॥ వడుగఁటయెల్లవిద్దెల దివస్పతియొద్దను-తూర్పుకొండపైఁ
బడమటికొండపైఁద నదుపాదములూని-గ్రహించెనంట, యా
తఁడు భవదీయభక్తుఁడట తావకభక్తిన కొండసాక్ష్యమా ॥పడ॥ ౪

చ॥ బడబడకాశికేగిసప్రపంచముతోఁ బనిలేదటంచు న
ట్టడవిని ముక్కుమూసికొని యోసదపించినఁ దాదపించినన్
విడుదలలేదు సంసరణవిప్లవమందున నిన్నుఁ గొల్వకో ॥పడ॥ ౫

చ॥ పుడమిననుప్రజమ్మునకుఁ బుట్టిన యిల్లుగఁ బూర్వకర్మచేఁ
బొడమిన దానసేమి? బుధపుంగవసన్నుత! నీపదాబ్జముల్
విడువక సంస్మరింపబడి వేలయఘంబులు దాఁటనౌఁగదా ॥బడ॥ ౬

చ॥ గడుసరికాలుబంటులకుఁ గంపము పుట్టును నీదుభక్తునే
రెడఁదఁదలంపురచ్చినపుడెల్లను నీదగు నామమంత్రపుర్
విడిదమనంబునాయది గణింతునెయింక పరేతనాయకుల్ ॥పడ॥ ౭

చ॥ బడబడ మ్రోఁగుతామనురసాపలె వాఁగుచు వారివీరినిఁ
గడబిడజేసి జ్ఞానియనిగాని మహోత్కృటిగాని పేరునే
బడసినవాఁడగాను నినుబ్రార్థనజేయుటెటొ యొండెనేర్చితిఁ
బడమట లంకరామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౮

చ॥ ఘుడుకుట యేనెఱుంగ మనపోడిమి మించినవారిఁజూచినే
మిడుకుట నేనెఱుంగ పరమేలును జూడనివారిఁజూచినే
నుడుకుట నేనెఱుంగ నినునోపిక వేఁడుట యొండుదప్పమో ॥పద॥ ౯

చ॥ గుడియొకటైన గట్టినొకగోపురమే నెలయింపగా వనం
బొడికముతోడ నిల్పగను, నో రఘునాయక చిల్లి గవ్వయే
గడనయొనర్ప నేర ననుఁ గన్ననచున్నన సేయుచున్నవా ॥పద॥ ౧౦

చ॥ వడివడి దానముల్సలిపి వారును వీరును తన్ను మెచ్చఁగో
గుడ్డువగ బెట్టికొందటికి, కులుకుటమున్దికి మార్గమా? నుదిఁ
సడలగనీక నీభజనసారెకు జేయుటమార్గమా? యహో ॥పద॥ ౧౧

చ॥ పడఁతియొకర్తు బిడ్డలకు బండెడుగా ధరియింపలేమిచే
గుడిపదిలమ్ము కష్టములకున్నిలయంబగు నింటికంటెయుం
చెడగలుగ స్వర్గానిని యెట్టులా భ్రమ్మర నేమిలాభమో ॥పద॥ ౧౨

చ॥ విడిబడిజందెముల్వేరికి వేసి వనంబుల జేర నేటికో
ఎడపకనిందలంచు పనినెవ్వరు కాదను వారలింటిలో
కొడుకుల గాంతునంచనెడు కోడలి వద్దను నత్తయుండునా ॥పద॥ ౧౩

చ॥ వడముడివంటి పెద్దబలవంతుడైయైనను సవ్యసాచిబో
లెడు రణశూరుడైనను లలిన్భవదంఘ్రిభజింపకుండు నేఁ
బడయగ నేర్చునే? యశము పాపవిశోషణ మానిషోషణా ॥పద॥ ౧౪

చ॥ బడిశము పాపమత్స్యముల పాలికి నీదగు నామముండగాఁ
జిడిముడిపాటుతోడఁ దనచిత్తము నింద్రియపాలికిచ్చెలోఁ
బడి శమనప్రచారమనివార్యమనంబనియేమి? శ్రీహరీ ॥పద॥ ౧౫

చ॥ వడిచెడినీచమానవుల పాదములంబడ నేటికయ్యా? రా
మునిఁడె యిఁక నాకు దిక్కనుచు మ్రొక్కినఁ దేల్చినవాఁడె యంచు నె
వ్వఁడు నిను నమ్మినో మదిని వానికి లేదిఁక నేఁగియున్నటుల్
బడమట లంకరాము! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౧౬

చ। ఉడుపతి గేరు నెమ్మొగము నొప్పగ కడగన్నుల మోడ్చు వాఁగ, మేల్
పిడికెడు కొనువాహ్య గాలి వేణిని యానిచ్చొక కొంత కాలముల్
గడిపితి గామజాడ్య పరికల్పిత సాంద్రత మోన్వితుండనై॥పడ॥ ౧౭

చ॥ గడపితినింక కొంతకలి గానికి లోగుట దుర్ప్రవర్తనం
జెడితిని తెప్పరిల్లితిని చేరితి నీపదసన్నిధి న్మహా
త్ముఁడవని ప్రేమజాతుఁడవని తొంబదమాటలు జెప్ప నేటికిన్ ॥బడ॥

చ॥ "గడుసొగసుందనమ్ము గల కామినిగూడుటయొద్దొ సంతతిన్
బడయుటయొప్పొ" యంచు బహుభంగులఁ జింతయొనర్చుచుంటి ని
ప్పుడు భరమయ్యె సంసృతి ప్రభూ! యిఁక చాలును నిన్నుఁ జేరితిన్ ॥బడ॥ ౧౯

చ॥ దుడుకుదనంపుఁబోకడలతో సన్నుతింబగు కీర్తినీతిఁ జొ
ప్పడని విధమ్మునం ధనము సారముగా గడియించి కష్టముల్
గుడిచె మటకన్న భక్తి నిను గొల్చుట యెప్పటికైన మంచిదే ॥పడ॥ ౨౦

చ॥ ఒడలు తిరమ్ముగాద దె ప్రొద్దో యిటనో పడిపోవు నీటిపై
బుడగ సమమ్మునం బోలుచు బొమ్మకు సొమ్ములు పోకు లేల? నీ
యడుగులఁ బూజ సేయుటొకటబ్బినఁ జాలదె? వేయు నేటికిన్ ॥బడ॥ ౨౧

చ॥ విడుతునె? ముష్టి కుచ్చ నిను వీడను నాసు నిన్నటన్న యా
తొడసొక ప్రక్కలాగ పుష్పమాలిలు వేటొక ప్రక్కలాగగా
నడుమను జిక్కితిన్న కొనునా దేవగడ్డము వానికింకనో ॥బడ॥ ౨౨

చ॥ కొడుకులు వెంటరారు తనకుం గల ద్రవ్యము వెంటరాదు య
క్కడి తిమిదన్న గూడు నలకోమలియేనియు వెంటరాదు తా
నడుగటు పెట్టు వేళ కపుడాదరువొక్కటి నీదు నామమే ॥పడ॥ 23

చ॥ తొడవులు నేధరించితిని తోటలు నాటితి విప్రకోటికిన్
దొడుకుల నిచ్చియుంటిని కృతుల్ గయికొంటిని సున్నపాకుదా
తొడిమెయు వెంట రాదుగద తొల్లిటిపున్నెము పాపమున్వినా
పడమటలంక రాము! ననుఁ బాలనసేయవె జానకీపతీ॥ ౨౪

చ॥ సుడివడగొట్టు భంగములు సుంతయడంగిన మీద దాటుదాన్
జడధి నటంచు నెంచు జడునందము నన్ గృహకర్మలెల్ల దా
గడచిన మీఁద నిన్నుఁ గనఁ గానగునంచుఁ దలంచు మూఢుఁడో॥పడ॥ ౨౫

చ॥ వెడగుఁదనమ్ముచేత హరిసేఁవహాసుండనసేఁటటం మునఁ
బెడగుతిఁగొందరెంచెదరు విజ్ఞునకీ వెహాయుండ వెన్న శిం
ఛుఁడెవఁడు నీవె భేదము విభూ! యిసుమంతయుఁ గానఁబడదయ్య నో॥పడ॥

చ॥ వెడదయురమ్ము తోడ గృపజెందె నెసలారెడు మాఫుతోడ నిం
పడరు మెఱుంగు కన్న సొగసైన తగు బంగరు వల్వతోడ నె
ప్పుడు కనుపట్టెదో యిఁక నీ ముఖ్యాని నెప్పుడు చేసెదో నను ॥పడ॥ ౨౭

చ॥ కడకిదియంచెఱుంగ నవకాశము లేనిది నీక జాడ నే
గడువుల నై ప్రతిజ్ఞలు ప్రగల్భములాడితి నిన్ను జూడ నీ
వొడబడి దర్శనంబిడెదవో, యటు సేయవో? నన్నె కాదనో॥పడ॥ ౨౮

చ॥ పుడమిని బుట్టుటాది నిను మ్రొక్కుచుఁ బాటలు పాడ వేడుకల్
వొడమున గదనమ్ము యాత్రమునఁ బొంగుచు నిన్ననియాడనోపికన్
బెడదలకోర్చి నిం గొలుచు పెద్దల గూడని వానికిబ్బునో ॥పడ॥ ౨౯

చ॥ మృడుననకెకాక శిక్షనుని మేనసగంబునుగొన్నదంట యా
పడతికిగూడ నీదు పదపంకజయుగ్మము సేవ్యమౌఁగదా
బడుగుల లెక్కయేమి మఘముబా నెఱువాడ! బుధాళినీడ! నో॥పడ॥30

చ॥ బిడియము లేక పెద్దలకుఁ బెద్దనటంచు ధనమ్ముగల్గు నా
తఁడు సభకెక్కుఁగాని నిముఁదన్మయతిన్ ధజియించునట్టి ర
క్షుఁడె తనకంటెఁ బెద్దయని కొంచెము గాని తలంపడయ్య నో॥పడ॥31

చ॥ పుడమిపడియంచునూతుదురు మంచిదె, నిన్మదినమ్మితృష్ణదా
నడపఁగలేనిదేటిపడి యూపడి గుమ్మడి,నన్నెఱుంగు టే
నుడుగుకు ముమ్మశుంగులగు మంచిబెడంగుమడుంగు కుమ్మరయో
పడమటు లంకరామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ 3౨

చ॥ కడుఁవడి మంచి పద్యములు కల్పనసేసెడి నేర్పుగల్గియే
గడుసరిలోభినో యకట గ్రాసపు కాసులకోసమాసచే
బడబడ వేఁడనేల నినుఁబద్యగణంబునఁ గోరఁదీరదో॥ పద॥ 33

చ॥ జడధిశయాన నీదగు ప్రసన్నతవోలె మహాగ్రహంబుదా
నిడగలదయ్య ముక్తియది యట్టులనన్న భవచ్ఛరాళిచే
మడిసిన రావణాదులును మానుషన్నినుఁజేరలేదొకో॥పద॥ 3౪

చ॥ జడయను దెబ్బలొగివియ ఒంకె మృగేంద్రునికైనగాని దే
వుడెవడు గివుడెవ్వడను పోకిరి నాస్తిక గన్న నేదియం
పడఁడును వినపోష! మృదుభాష! నభోమణివంశభూషణా ॥పద॥ 3౫

చ॥ అడకువ దైవభక్తి కరుణాదిగుణంబులులేక మూర్ఖతన్
మిడిసిపడంగనౌనె! ఘనమే బలవంతుల నుంచొకింతనే
కడచునె? యొక్కరీతి దినకాలము మేలిమి నెల్లకాలమున్॥పద॥ 3౬

చ॥ ఇడుములనంపనేల! ననునింతిగ వేడఁగనేలపోఁ వెం
బడిబడదేల నిన్నెఱుగమా! యనెదో! సరి కన్నతల్లియే
నడుగక పెట్టదన్నమను నార్యులసామెతనీ వెఱుంగవా॥పద॥ 3౭

---

బ్రహ్మశ్రీ. బలిజేపల్లి లక్ష్మీకాంతకవి విరచితము,
గుంటూరు.

చ॥ పాడమిఁ నాటినుండియును ప్రశ్నములే ప్రసరించినన్ మునీ
కడనిటు వైసిమాలి మొగుగింపని యేమి జనించి పాపపున్
నడవడి కగ్గమైన కలన్ నిను వేడతి దప్పెతింగినో ॥పద॥ ౧

చ॥ పుడమిని బాపమొక్కనికిఁ బున్నియమొక్కనికేల యందఱన్
గడుపునఁగన్నవారి సొకకంటఁగనన్ దగుఁగాదె కర్మపున్
గడనబడిన్ లభించుననఁగ గర్తవు హర్తవు నీవెగాదె గౌ
పడనుట లంకరామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౨

చ॥ అడరు భవాంబుధిన్ మునుఁగుచుట్టివిపన్నుల సంతరింపనె
గ్పడిన మహాత్మునిన్ను మనుపంబున గంగ తరింపఁజేసి నా
తఁడుగుహుడెంత పుణ్యుఁడో గదా యటు నాకులభింపదయ్యెగదా॥పద॥ 3

చ॥ పుడమిని మానవుండనయి పుట్టి గడించిన దేమినీవు పే
ర్డవుల సంచరించునపు డెందొక బోయలైనై పులుంగనై
కడకొక క్రోఁతినైనినుఁదగన్ భజియింపగ నోచనైతినో॥పద॥ ౪

చ॥ విడివడిఘోరపాపపదవీచుదనిభ్రమలాలసుండనై
చెడితి మహాపచారములుజేసితి ముందటికేమి దుర్గతిన్
బడయుదునో భయంపడు విపన్నుఁడ నీదరిఁజేరినాఁడనో॥పద॥ ౫

బ్రహ్మశ్రీ. బొగ్గవరపు శ్రీరామశాస్త్రి విరచితము,
నర్సారావుపేట.

చ॥ కుడియెడవాళ్ళసందునివగోరికఁ దిరుగఁజూచువాఁడహో
యొడయఁడ! నీవుగన్పడగ నొప్పులకుప్పగఁ దన్మయత్వమా
గడియనెచెందిమైమఱచిగాఢసమాధి, నిరుగ్నుఁడౌఁగదా॥పద॥ ౧

చ॥ జడమగుమేనెనేననుచు సాగజనుల్ సహ, సర్వపాపముల్
గడువడిఁజేసి కామలవకాంక్షయుఁ దిరకయంత్యకాలమం
దడలెడుమూఢుఁడన్ మిగులవార్తిలఁబడి కీల్వఁబ్రోతువో ॥పద॥ ౨

చ॥ ఎడతెగకుండరాత్రి బవలెప్పుడునిన్ దనకంతిరాత్మగా
నడుగడుగందుఁ దత్త్వమసియంచును లక్షలుగోష్ఠిసాధ్యరాఁ
బడనిమనస్సమాధి నినుఁబాయకచింతిలువాఁడనీవగున్ ॥పద॥ 3

చ॥ నుడువులరామమంత్ర మొకనూఱు జపించినఁ జిత్తవీధిలోఁ
నెడపడకుండనిట్టి ఘనవిహీనున కబ్బునె తత్త్వసిద్ధిలోఁ
గడిసుకృతంబు నీదయయు గల్గినవాఁడెపూని వేదానగుణ్
బడమట లంకరామ! ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౪

చ॥ గుడితనువెల్ల ప్రాణములుగోష్ఠఘటుల్, మతిసీతమాంబమై
బడలిక గాఢనిద్రయెనిబద్ధసమాధి, పదప్రచారముల్
విడువనివిప్రదక్షిణలు వెర్వకపల్కెద నేనెనీవు శ్రీ ॥పద॥ ౫

చ॥ గడుఁగుదనంబుగాదువిను కాయము నేననుకున్న దాసుఁడన్
విడువక నేనుజీవుఁడను వేళ హరీ! భవదంశజాతుఁడన్
ఒడియక నాత్మనేనగ స్వామియురీతి వినుమీవె నేను శ్రీ ॥పద॥ ౬

చ॥ జడుప్పాకయింతలేదువిను సర్వమునీవని వేదశాస్త్రముల్
విడువక వేదవేత్తలును వేయువిధంబులఁ జాటుచుండఁగా
నడిగెద నేను వేరెటులనయ్యెద నయ్యెయునీవె నేను శ్రీ ॥పద॥ ౭

చ॥ గడియకునూఱుపద్యములు కల్పనచేతుఁ గదేమి ప్రజ్ఞగా
నుడివినయన్నియక్కరలు నోటవచించిన సాక్ష్యమోంకృతిన్
బోడమెఁదదర్థమే నెనినుఁబొందితతి మీనినిదెల్పరేకవుల్ ॥పద॥ ౮

చ॥ జడమన్బ్రహ్మ్యంభసాంత, శుభసంఘశరీరమ్ము జ్ఞానసత్యముల్
బడయననంతమోదమని బ్రహ్మమునుల్ పలుమారుబోధతోఁ
నొడబడశిష్యసంఘముల కొప్పుగ జెప్పెద రెప్పునిన్నె కా ॥పద॥ ౯

చ॥ కుడిచియుఁ గూరుచుండినిను గోర్కెలుదీర మనంబునందు ని
త్యుఁడవనిశుద్ధబుద్ధపరితుష్టవిముక్త విశిష్టభావ్యగా
నొడలునవిశ్వవిస్మృతిననూనతనొందినవాఁడెనీవగుణ్ ॥పద॥ ౧౦

చ॥ సుడివడిసంసరాంబునిధి శోకముమోహము రాగముల్
గడువడిభంగసంచయముకై పడి ముంచగఁ గుయ్యొమొఱ్ఱో నేఁ
గడువగఁ జాలఁ గావుమసద్గతుఁ కృపాబ్రోవు మహానుభావశ్రీ ॥పద॥ ౧౧

చ॥ జడము గుణత్రయాత్మకము సాంతప్రధానము సత్వభాగమే
వడిగలమాయ తత్ప్రకృతిభాగములన్నియవిద్య వానియం
దెడప్రతిబింబితాత్మయగు నీశ్వరజీవులు మిధ్యలైరియ
య్యెడనిఖిలాత్మ వొక్కఁడవహీనగుణాంబుధి! నీవె నేను శ్రీ
పడమట లంకరామ ? ననుఁబాలన సేయవె జానకీపతీ॥ ౧౨

సంపూర్ణము.



# శుద్ధపత్రిక.

| పేజి. | పఙ్త్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 4 | నినుబాలన | నను౯బాలన |
| 5 | 12 | నావిడివితి | వాపిడిచితి |
| 6 | 2 | ష్ఠిఁడు-ప్రసిద్ధ | షుఁడు-విశుద్ధ |
| డిటో | 15 | సనుం | సనుఁ |
| డిటో | 17 | శ క్తినదు | శ క్తియుడు |
| 7 | 1 | నికు | నీకు |
| డిటో | 7 | నడిదెగ | నడిగెద |
| డిటో | 12 | గడెగి | గడిగి |
| 10 | 2 | నెంత్రివి | యంత్రివి |
| డిటో | 6 | నైచి | నైచి |
| డిటో | 8 | వృధాగా | వృథగా |
| 13 | 1 | ఒడెచెదు | ఒడిచెదు |
| 14 | 10 | నుుద్ధరింతు | నుద్ధరిఁతు |
| డిటో | 21 | దోగుచుంగ్రు | దూఁగుచుంద్రు |
| 15 | 6 | నైష్టికు | నైష్ఠికు |
| 16 | 1 | భోగ్యము | భాగ్యము |
| 28 | 14 | గ ఘు | ర్ఘు |
| ,, | 20 | న్న యునీ | యున్ననీ |

